శుభమస్తు.

# పట్టాభిరామశతకము.

## రామాయణ కథా సంగ్రహము.



సీ॥ శ్రీజానకీమనోరాజీవమార్తాండ కౌసల్యాగర్భసాగరశశాంక। త్రి
శిరమారీచాది త్రిదశారి సముదయమదకాల జీమూతవిదితపవన। ము
నిసతీశాపవిమోచనపాదాబ్జ పావనచారిత్ర పద్మనేత్ర। హరశరాసన
భంగ వరపతంగతురంగ పంక్తికంధరగర్వాపవనభుజగ। జలధరశ్యామ
శతృసంచయవిరామ। పరమకళ్యాణ నిర్జితపరశురామ। వరగుణస్తోమ
శ్రీపైడిపాడధామ। రాజసుత్రామ పట్టాభిరామనామ॥ ౧.

వసుధలో శ్రీపైడిపాడనివాసుండు ఘనయశోయుతుండైన గాన్గ
పాటి। నారాయణామాత్యనందనుండగు పెద్దిరాజు కాకనొకనాటి రా
త్రివేళ। బవళించియుండి స్వప్నంబున శ్రీరామ మందిరమందు సింహాం
దదాను। శ్రీమీర బట్టాభిరామయంచును నొక్క శతకంబు జదివినగని
జెలంగి। మేలుకొని రాము నెదలోన గీలుకొల్పి। పరగమరునాడు నా
తోడ బల్కెనిట్లు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ। రాజసుత్రామ ప
ట్టాభిరామనామ॥ ౨.

తోలేటివంశాబ్ధితుహినాంశు వైనట్టి భాగేశ్వరునకు సుబ్బమకు
నగ్ర। సుతుడనై రసికుడౌ సూర్యనారాయణమంత్రికి గ్రజుడనై మహి
జనించి। ధారుణిలోన సీతారామయాఖ్యచే విలసిల్లి యాంధ్రకవిత్వ
మందు। పరిచయుండవుగాన బట్టాభిరాముని కథనొక్క శతకంబు గా
రచింపు। మనివచింపంగ సంతసమందినేను। బొల్పుగా స్వప్నవృత్తాంగ బూ
నుకొంటి। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩.

సమస్తవనుల శైలంబుల వానరభల్లూకసముదయంబై మహాశ్చర్యమొ
ప్ప। సత్వసంపన్నులై జనియించి కామరూపంబులుగల్గి ప్రభాకరోప।
మానులై కార్తికేయసమానశౌర్య। ధుర్యులై యుద్భవించి రవార్యము
గను। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮.

భానువంశక్షమాపతియైన దశరథుజాయాత్రితయగర్భజలనిధు
లను। లలిమీర శ్రీరామ లక్ష్మణభరతశత్రుఘ్న నామముల బొందు
గ జనించి। వేదవేదాంగకోవిదులై ధనుర్వేదధర్మశాస్త్రాదివిద్యలు గ్ర
హించి। సామజతురగశిక్షాక్రమంబులెరింగి యుపనీతులగుచు గురోప
దిష్ట। కర్మలొనరింపుచుండ నక్కౌశికముని। యొకదినంబున వచ్చె న
యోధ్య జేర। వరగుణస్తోమ॥ ౯.

మునిరాగ దశరథజననాయకుం డంత సకలభృత్యామాత్యస
హితుడగుచు। నెదురుగాగొంతదవ్వేగి మౌనీంద్రుని వెంట దోడ్కొనివ
చ్చి వినయమొప్ప। నర్ఘ్యపాద్యము లిచ్చి యర్హాసనంబున నాసీను
గావించి హస్తయుగము ఫాలంబునం జేర్చి భక్తి దీపింపంగ మ్రొక్కి మహో
త్సాహమున మునీంద్రు। గాంచి మదిలోన గుతుకమగ్గలముగాగ। బల్కె
నీరీతి వినయసంభాషణముల। వరగుణస్తోమ॥ ౧౦.

గాధినందన మామకగృహము నీరాకచే బవిత్రంబయ్యె క్షితిని నే
ను। ధన్యుండనైతి సంతసమొప్ప మీరు నాకడకు విచ్చేసిన కారణంబు।
దయ నెరింగింపుడీ తప్పకుండ నొనర్తు ననగ సంతసమంది మునివరుండు। జ
ననాథుతో డనిట్లనియె నో భూమీశ వినుము నే వచ్చిన విధము నీకు। వి
వరముగ విన్నవించెద నవధరింపు। మనుచు జెప్పంగ దొడగె నమ్మునివ
రుండు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౧.

జననాథ నేనొక్క జన్నంబు బొనర్పగా గడగితి దాని విఘ్నంబొన
ర్ప। నీచాత్ములైన మారీచసుబాహ్వాది దానవవీరు లుద్దండులగుచు। గా
చుచు నున్నారు గావున దత్క్రతురక్షణార్థంబు శ్రీరామచంద్ర। సౌమి
త్రులను బంపు జన్నంబు తుదముట్టు నిందుకించుక సంశయింపవలదు। త్వ

రగబంపు మటన్న నాదశరథుండు। మదిని దిగులొంది పల్కె నమ్మౌని తోడ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౨.

ఓమహానివర్య శ్రీరామలక్ష్మణు లతిబాల్యులు శరముచాపంబు నందు। సంధింపలేరు రాక్షసుల నెట్లు వధింప జాలుదు రిదిగాక సమర మెపుడు। గన్నులతోనైన గాంచియుండగలేదు కావుననిప్పుడు మీవెనుకను। సైన్యంబుతోడ నే జనుదెంచి యజ్ఞరక్షణజేతు ననగ నాగాధిసుతుడు। మందహాసంబు జేసి యామానవేంద్రు। గాంచి వచియించె నీరీతి ఖండితముగ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౩.

రాజశేఖర యజ్ఞరక్షణం బొనరింప నిలరామలక్ష్మణేశులకుదప్ప। నోరులెవ్వారికైనన గోరరాదు సిపట్లు పుచ్చకయున్న నిప్పుడశపింతు। ననగ నాదశరథజననాయకుడు మహాభయచిత్తుడై మారుపల్కనోడి। ఘనుడైనయవ్వసిష్ఠుని దిక్కుజూడంగ నతడు త్రికాలజ్ఞు డగుటజేసి। వేడ్కదశరథమేదినీవిభుని గాంచి। విమలమతి నిట్లు కడురహస్యముగ బల్కె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౪.

రాజేంద్ర వినుము శ్రీరామచంద్రుండాదినారాయణుడుగాని నరుడుగాడు। బ్రహ్మచేబ్రార్థింప బడి రాక్షసులదుంప నవనిలో మనుజుడై యవతరించె। నిదినిక్కువంబింక నీకౌశికుని వెంట సౌమిత్రితోడ శ్రీరామచంద్రు। బంపుమాతనికేమి భయములేదనియుపదేశమిచ్చిన ధారుణీశుడలరి। కౌశికునిజూచి మీయాజ్ఞ గడువనెంత। వాడననిపల్కె నపుడు భూవల్లభుండు। వరగుణస్తోమ॥ ౧౫.

గురుడానతిచ్చిన తెరగున దశరథక్ష్మాపతి నిన్ను లక్ష్మణుని బంప। బాణాసనంబులు తూణీరములు దాల్చి మందహాసముఖారవిందులగుచు। జననీజనకపాదవనజంబులకు మ్రొక్కి వేడ్క నరుంధతీవిభున కెరగి। కౌతూహలంబొప్ప గౌశికు వెనువెంట నరిగియాతడొనర్చు యజ్ఞవాటి। జేరనే తేర నమ్ముని శేఖరుండు। ప్రీతినినుగాంచి పల్కె నీనెశిగాను। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥

అవనీశతనయ నే సవనదీక్ష వహింతు నీవునీతమ్ముడు చేవమీఱ।
రాక్షసవరులిందు రాకుండఁగాఁగాచి యుండుండనుచు నయోగ్యాగివరుఁడు।
మునులతో ఋత్విక్సమూహంబుతోఁడఁదా హోమంబు సేయుచు నున్న
తరిని। దాటకయనెడి నిశాటిదా ఘోరరూపంబుతో రాఁగఁ జాపంబునం
దు। బెడిదమగుబాణ మొక్కటి తొడిగి దాని। శిరము ధరఁ గూల్చితివి
కాదెసురలువొగడ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౭.

పరువడియపుడు సుబాహుమారీచాది త్రిదశారు లగణితదివ్యశ
స్త్రి। వరములుదాల్చి భాస్వద్రత్నభూషణభూషితులై మహాభీషణము
గ। వచ్చినిన్నొదువంగ నచ్చెరువొప్ప విల్లెక్కిడిబల్తూపు లొక్కమొగి
ని। వెసనేసి తత్సైన్యవిసరంబునుగ్గాడి వారక ఘనమైనమారుతాస్త్రి।
మేయ మారీచుఁ డప్పుడు తోయరాశి। బడి సజీవితుఁడై భీతి బఱచెఁగాదె।
వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౮.

తివిరి సుబాహుని దీవ్రబాణములచే శమనుపీటికిబుచ్చి జన్నమ
పుడు। మునిపతినిర్విఘ్నముగ నొనర్చి ప్రమోదమానమానసుఁడయి
మఱియమోఘ। దివ్యాస్త్రిచయ ముపదేశమిచ్చి కుతూహలంబున మి
థిలాపురంబునకును। నినులక్ష్మణుని దోడికొనుచు నేగుచునుండ మార్గ
మధ్యంబున మౌనిసతికి। శాపమోక్షణ మొనరించి జనకపురికి। నేగుదెం
చితి వప్పుడయ్యోగితోడ। వరగుణస్తోమ॥ ౧౯

లక్ష్మిసరోజాక్షి లంకాపురంబందు దమ్మిపూవున బుట్టి దశము
ఖునకు। గన్పింపగా బంక్తికంఠుండు శంకించి విబుధాజ్ఞ నామెను బెట్టె
నుంచి। జలనిధిలోవైవ జయ్యనవాపెట్టె నెట్టననీవల గట్టుజేరి। క్రమము
గానది మహీగర్భమందున జొచ్చి యుండంగ మిథిలేశు డొక్కనాడు।
జన్న మొనరింప భూమిని దున్నబనుప। కంగుమని మందసంబు నాఁగట
నుదాకె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౦.

హాలికులెల్ల నత్యద్భుతచిత్తులై మెల్లన నాపెట్టె బెల్లగించి। జన
కునికర్పింప ఘనమోదమునదాని తెరచి చూడగ నందు మొసపుత్రీ(?)గ।

లీల బ్రకాశించు బాలిక నీక్షించి ప్రేమచేఁగొనిచని పెంచుచుండ। బాలి
కామణి శుక్లపక్షసుధాకరు చందంబుగా వృద్ధి బొందుచుండ।నప్పుడబ్బా
లికకు వివాహంబొనర్ప। తనమనంబున దలచె నాజనవిభుండు। పరగుణ
స్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౧.

ఒప్పుగా దనయింట నున్న శంభునిశరాసన మెక్కుపెట్టిన ఘనబ
లునకు। వైదేహినిచ్చి వివాహంబొనర్చెద ననుచు షడ్బాణసంఖ్యాకదే
శ। ములకు జాటనంపిన ముదమొప్ప సర్వరాజన్యులేతెంచిరి జనకపురికి।
శుభముహూర్తమునందు సభజేసి జనకుండు శివుకార్ముకంబు భూధవుల
మ్రోల। నుంచుడనగను పదివేవురురుబలాఢ్యు। లైనజనములు గొని
వచ్చిరచటికపుడు। వరగుణస్తోమ॥ ౨౨.

ఆశరాసనము సర్వావనీనాథులు గనుఁగొని యాశ్చర్యకలితుల
గుచు। నటునిటు గదలింప నైనశక్యముగాక నిశ్చేష్టులైయుండ నీవులేచి।
కౌశికుననుమతి గార్ముకంబునుబట్టి యెక్కుడబోవంగ నక్కజముగ। గ్ర
క్కున నక్కార్ముకంబుమధ్యకు మూడు ముక్కలుగాఁగ బల్విక్కసంబు।
జెందిరాసభగల నృపులందరపుడు। పూనిగురిపించి రమరులుసూనవృ
ష్టి। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౩.

సంతోషమొప్ప నాజనకమహారాజు మౌనితో రామలక్ష్మణులు
వచ్చి। సవనంబుగాచుట వివిధాసురావలి నొంచుట మిథిలకేతెంచు
చుండి। ఘనశిలయైయున్న గౌతమసతిశాపమోక్షం బొనర్చుట మోద
మలర। గంగాధరునిచాపభంగం బొనర్చుట భూమిజయగుసీత రామున
కును। ముదముతోనీయదలచుట మొదలు వార్త। లెల్ల దశరథునకు
వ్రాసెనుల్ల మలర। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౪.

వలనొప్ప జనకుండు వ్రాసినశుభలేఖ విశదంబుగా జూచి దశర
థుండు। బంధుమిత్రామాత్యభామినీసహితుడై రథతురంగాళితో మి
థిలకరుగ। జనకుండువారల సన్మానమొనరించి ప్రీతిమీరగ నీకు సీతని
చ్చి। తనతనూజాతయై తనరునూర్మిళను సౌమిత్రికినిచ్చి,కూర్మినివివా

హా। మొనరగావించి మరి తనయనుజునుతల। భరతశత్రుఘ్నులకు నిచ్చె ప్రమదమొప్ప। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౧.

ఈరీతి జనకుండు గూరిమి గన్యకాదానంబు లొనరించి తగినమేటి। కానుకలర్పించి ఘనముగా నంపింప బెండ్లికూతుల వెంట బెట్టుకొనుచు। పరువడి సాకేతపురికేగుచుండంగ సరభసం బొప్పంగ జామదగ్న్యే। యెదిరింప నాతని మదమడంచి సురాళి వొగడంగ సాకేతనగరమునకు। వెలయగా జేరితివి మహావిభవమొప్ప। గడగెరచియించితిని బాలకాండమిద్ధి। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౬.

## అయోధ్యాకాండము.

దశరథమేదినీతలనాయకుడు నిన్ను శ్రీమీర బట్టాభిషిక్తు జేయ। మది నూహజేసి సన్మురమొప్ప నేబదియారు దేశములేలు ధారుణీశులకు సర్వబంధువులకు శుభలేఖలు ప్రియమార వ్రాసి పంపించి మరియు। నారూఢి బురమలంకారంబు గావింప నుత్తరువిచ్చి శ్రీయుతముగాగ। స్వర్ణదీతోయములు మరి సప్తసాగరోదకంబులు దెప్పించె మోదమలర। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౭.

బంధువర్గము బిల్వ భరతశత్రుఘ్నుల నంపించి సకలమహర్షివరుల। గొనిరాగవిప్రుల బనిపిను వేదికల్ నిర్మింపజేసి పన్నీరుమటిచేయు। గస్తూరిచందనకస్తూరికాకుంకుమాదివస్తువు లెల్ల నమర గూర్చి। గాయకపౌరాణికశ్రేణినర్తక నైణికసత్కవీశ్వరులకెల్ల। వార్తలను వేడ్క నంపించి వసుమతీశు। డతిసముత్సాహమునమది నలరుచుండె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౮.

ఆసమయంబునం దారాజుపత్నియగు కైకేయికడదాదిగావసించు। మంథరయనునది మనుజేశు డొనరింప గడగుపట్టాభిషేకప్రయత్న। మెల్ల గన్గొనితనమున్గ బోయినరీతి గదునడి కైకేయి కడకు బోయి। తల్లిరో వినుము నీ ధవుడునేటిదినంబు శ్రీరాముబట్టాభిషిక్తుజేయ। నిశ్చయ

ము జేసినాడింక నీసుతునకు । నేమిలేదాయె ననిమరి యిట్టులనియె। వర
గుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౨౯.

రామచంద్రునకు నీరాజ్యాభిషేకంబు జేసిన భరతుండు దాసవృ
త్తి । నుండంగవలయు నయ్యుర్విజాపతికడ గావుననిపుడు శీఘ్రముగ నీ
వు। నీపతికడ కేగి నీకాతడిచ్చిన వరములిప్పుడువేడ వలయునమ్మ। వలనొ
ప్ప బదునాల్గు వర్షముల్ రాముండు వనవాసమున కేగి జనుట యొక
టి । భరతునకు రాజ్యమిచ్చుట పరగనొకటి । కోరుమనిబోధజేసె దా
గూహకమున। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩౦.

దాదిమాటలకు సమ్మోదమానసయయి కైకేయి దశరథు గదిసి
పల్కె । నాథమీ రలనాడు నాకిచ్చినవరంబు లిప్పుడు వేడెద దప్పకుండ।
దయసేయుమెట్లన్న దవర స్వరాజ్యంబు నచ్చుగాభరతుని కిచ్చుటొకటి ।
పరగచతుర్దశాబ్దములు. శ్రీరాముని బహుళ తరాటవులకు బంపుటొకటి।
ప్రకటమొప్పగ నిట్టివరద్వయంబు । వేడ్కనిమ్మన భూపతి వెరపుజెందె।
వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩౧.

కైకేయి జూచి భూకాంతుడిట్లనిపల్కె దరుణిరో యిట్లాడ దగు
నెనీకు। నగ్రజన్మునకు రాజ్యాభిషేకము సేయ ధర్మంబుగాదె యీధరణి
లోన। ధర్మం బెరింగినదానవు నీవిట్టు లనగూడదనగ నవ్వనితవిభుని। గ
నిపల్కెనీవట్లు కావింపకుండిన దేహంబువిడుతు సందియములేక। యనగ
దశరథు డెదలోన నదరి మూరు। పల్కగానోడి ఖిన్నుడై పవ్వళించె। వ
రగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩౨.

శ్రీరామ నీవుతండ్రికి మ్రొక్కనేతెంచి ఖిన్నుడై పవళించియున్న
వాని । గనుగొని భయమంది కైకేయి నడుగంగ జరిగినచర్యను సరభస
మున। జెప్పిన సంతోషచిత్తుండవగుచును జనకునిబోధించి జనకజాత। స
హితుండవగుచు నాశ్చర్యమొప్పగ వల్కలాంబరంబులుగట్టి యాక్ష
ణంబ। విపినములకేగదలచిన వినిసుమిత్ర। పట్టి మీతోడ దానును బ
యనమయ్యె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩౩.

జానకీలక్ష్మణసహితుండవై నీవు వల్కలంబులు దాల్చి పరవిభూతి । యొడలనలంది కెంజడలల్లి ముడిగొల్పి తల్లులకునుబ్రణమిల్లి తండ్రి। కెరగి పౌరజనాళి పురపుర బొక్కంగ పురినిర్గమించి యత్యురుతరముగ। గుతుకమెలర్పంగ గుహుని గన్గొని గంగ దాటి యవ్వల జిత్రకూటమునకు । జేరగా నంత దశరథధారుణీశు। డమితశోకముచే దివి కరిగెనపుడు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩౪.

భరతు డయోధ్యకు బర తెంచి జరిగిన వర్తమానము విని వగలబొగిలి। తండ్రికి నపరకృత్యంబులు గావించి తల్లినిదూరి తత్క్షణమునందె। బంధుమిత్రామాత్యవరులతో సింధుర స్యందనహయభట సముదయంబు।గొని శీఘ్రముగ జిత్రకూటంబునకువచ్చి నినుగాంచి నీపదవనజములకు। నెరగి దశరథు మరణంబు నెరుగజేసి। తిరుగవిచ్చేయుమనుచు బ్రార్థించెగాదె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩౫.

భరతునిచేదండ్రిమరణంబువిని నీవు సౌమిత్రియును శోకసాగరమున। మున్గియప్పుడు స్నానములుజేసి తండ్రికి నౌర్ధ్వదైహికకృత్యంబు లాచరించి । కైకేయిపుత్రుని గాంచిమేమిప్పుడు పురికిరామిక నీవు బోయి ప్రజల। నయమొప్ప బరిపాలనముసేయుమన్నను భరతు డందుల కిష్టపడక తాను । జడలుధరియించి మీతోడ నడవులకును । వెడలివత్తునటంచు బల్కెడినిబల్క। వరగుణస్తోమ॥ ౩౬.

పరమమోదంబున భరతునిబాడగాంచి గురునాజ్ఞ మీరంగగూడదిప్ప । డమరజతుర్దశాబ్దములు మౌనులసేవ లొనరించి వెనుకనయోధ్యకేగు।దెంతునటంచు బోధించియాతడు గోర నీపాదుకలొసంగి నిరుపమాన । వాత్సల్యమొప్పంగ వానికిసెలవీయ భవదాజ్ఞమీరక భరతుడరిగి। తానుజడలునువల్కముల్ దాల్చిమిగుల। మోదమొప్ప నందిగ్రామమున వసించె। వరగుణస్తోమ॥ ౩౭.

అనుజుండు నీవు నయ్యవనిజాసహితులై చిత్రకూటముబాసి యత్రిమౌని। యాశ్రమంబునకు బో నమ్మునీంద్రుడు ప్రీతినాతిథ్యమొనరిం

పనచటనిలచి। యుండంగననసూయ నిందు వేడుకతోడ ధారుణీసుతకతి
గౌరవమున। దనరపతివ్రతాధర్మంబు లుపదేశమిచ్చిన నా రేయునిచ్చ
మీఁర। ననుజుతోఁ భార్యతోడుత నందునుంటి। కాదె తగనయోధ్యయ
నెడి కాండమిద్ది। వరగుణస్తోమ॥ ౩౮.

## అరణ్యకాండము.

మరుచటిదినమందు మౌనీంద్రుచేనాజ్ఞ గొనిదండకారణ్యము
నకువచ్చి। తన్నివాసస్థులౌ తాపసోత్తములచే నాతిథ్యమునుబొంది య
టవిరాధు। జంపి శూర్పణఖ నాసాకర్ణములుగోసి ఖరదూషణాది రా
క్షసులద్రుంచి। పర్ణశాలకువచ్చి స్వర్ణమృగంబైన మారీచుబరిమా
ర్చి మహిజనచట। రావణునిచేత గోల్పడి తావకాను। జన్మతోఁగూడి
చిత్తంబు చంచలింప। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౩౯.

కోలకులవనుల నికుంజపుంజంబుల గిరిగహ్వరంబుల ధరణిసుత
ను। వెదకుచుజనిచని విహగేంద్రుడగుజటాయువు గాంచి వానిచేనుర్వీ
జాత। నసురకులాధీశు డగుదశాస్యుడుగొంచు నేగుచుండగవాని నెది
రితాను। యుద్ధంబొనర్చుట నుద్ధతుడౌ దైత్యవిభునిచే నెరకలు విరుగుట
యును। శీఘ్రగతినంత దైత్యుడు సీతగొంచు। లంక కేగుట వినినీవులక్ష్మ
ణుడును। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౪౦.

ఆజటాయువునకు నగ్నిసంస్కారంబు గావించివానిస్వర్గమున
కనిచి। దనుజుండు జనకజ గొనిపోయెనని యతికోపలజ్జామనస్తాపము లె
చ। బెనగొనగా సోదరుని వెంటదోడ్కొని వనములు దిరుగుచు జని కబం
ధు। డనువాని శాపముక్తునిజేసి శబరికిమోక్షంబొసంగి మీరాక్షణం
బ। పావనంబైన పంపాసరోవరంబు। గాంచితిరిమీర లారణ్యకాండమి
ద్ది। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౪౧.

## కిష్కింధాకాండము.

పంపాసరోవరోపవనంబునను విహరింపగా మిమ్ము సుగ్రీవుడప్పు
డు। కనుగొనిభయముచే ననిలపుత్రునిజూచి పల్కెనీరీతి నాథానుసూ

తి। గనుగొంటివేవారి నినచంద్రులనుబోలి యున్నారువీరెవ్వరొక్కొజ
డలు। ధరియించినారు హస్తంబుల శరాసనంబులు పట్టిరినాకుజూడ।
వీరలవ్వాలిబంపిన వేషధారు। లనుచుసందేహముదయించె ననివచించె।
వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౪౨.

రవిజునితోడనా పవనజుడిట్లను వారలబరికింప వాలిదూత। ల
నుచుదోపదు నాకు ఘనులగు రాజర్షివర్యులగతి నున్న వారువీరు।
సందేహమేలనే జనివారలెవ్వరో సాకల్యముగవారి చర్యలెల్ల। గనుగొ
నివచ్చెదనని చెప్పి భిక్షుకవేషంబుదాల్చి యావృక్షచరుడు। మిగులవిన
యంబుతోడను మిమ్ముజేరి। భక్తిబ్రణమిల్లి తానిట్లు పల్కెనపుడు। వర
గుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౪౩.

దేవ మీరెవ్వరో శ్రీవరపార్వతీపతులరీతిగ నున్నవారలిట్లు। జ
డలుధరించి యీయడవులవిహరించు కారణంబెద్దియో కరుణతోడ।
వినిపింపుడంచును వినయంబుతోవేడ గపివరుతోడలక్ష్మణుడుపల్కె। సూ
ర్యవంశాంభోధి సోముడౌ దశరథరాజపుత్రులము శ్రీరాముడాత। డతని
తమ్ముడలక్ష్మణు డందురినన్ను। నయ్యపంపునవచ్చితి మడవికనియె। వర
గుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౪౪.

మరియునిట్లనియె లక్ష్మణుడువాయుజునితో నీరీతివనికిమేమేగు
దేర। ఖరదూషణాదిరాక్షసులు రామునెదిర్చి మిడుతలుదావాగ్నిబ
డినరీతి। నిహతులైరంత నీమిహిరాన్వయాంభోధి చంద్రునిజాయయౌ
జనకసుతను। దశకంధరుడుమహోద్ధతి నెత్తుకొనిపోవ వికలచిత్తముల ని
వ్వాపినమందు। దిరుగుచుంటిమనంగ వానరవరుండు। కటకటంబడిమరి
యు దానిటులబల్కె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౪౫.

దేవ భానుజుడు సుగ్రీవుడ నగపిరాజుగలడాతడగ్రజువలనిభీతి। నీ
ఋశ్యమూక మహీధరాగ్రమ్మునందుండె నాతనిసచివుండనేను। వాయు
సూనుడనాంజనేయాహ్వయుండను మీరెఱంగారయ మిగులవేడ్క।
నాతడునన్నుబొమ్మన్న నంత మెఱుప దావకదర్శనార్థంబిచటికి। వచ్చినా

డనుమీకు నవ్వనజమిత్ర। పుత్రునకుసఖ్యమొనగూడు భూపవర్య। వ
రగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౬.

ఇట్టులుచెప్పితా నినసూనుకడకేగి వారకమీసవిస్తారమెల్ల। నె
రిగించియాతని నిమ్ముగాదోడ్తెచ్చి మీసన్నిధినినిల్ప మిత్రజుండు। భక్తి
తోనీపాదపద్మంబులకుమ్రొక్కి శరణుజొచ్చితినన్న బరమముదిత। చి
త్తుడవై వానరోత్తమునాలింగనంబొనరించి ప్రియంబెలర్ప। నచటరమ్య
ప్రదేశమందధివసించి। యుండనీతోడబల్కె మార్తాండసుతుడు। వరగు
ణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౭.

శ్రీరామచంద్ర సుస్థిరమానసుండవై వినవయ్యనేజేయు విన్నపం
బు। నాకగ్రజుండును పాకారిపుత్రుండు నగువాలి మిగుల నన్యాయము
గను। నాపత్నిగైకొని నన్నుజంపగడంగ వానితోబోరాడ వశముగాక।
నామంత్రివరులతో నగరంబువెల్వడి ఘనమైన ఋశ్యమూకంబు జేరి।
యుంటినాతడు వెదకుచు నుండునెపుడు। నిన్నగముజేర డాకశాప ము
న్నకతన। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౮.

తపనజుడిట్లు విన్నపముజేసిన నతికృపతోడ నప్పుడాకేశవరుని।
గనుగొనిచింతింప గానేలవాలినొక్కమ్మున దున్మినిన్నాపురంబు। నకు
రాజుజేసెదనకముబోనిడుమంచు నీవానతిచ్చిన నీరజాప్త। సుతుడుసంత
సమంది హితమతి నీపాదవనజంబుల కనేకవందనములు। చేసి కరపద్మ
ములుమోడ్చి శిరమునందు। జేర్చివిన్నపమొనరించె జిత్తమలర। వర
గుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౯.

రవివంశదుగ్ధాబ్ధిరాకానిశాకరా వినుమొకనాడు పావనిమొద
లగు। నామంత్రిముఖ్యులౌ నల్వురుకపులతో లలిఋశ్యమూకశైలంబు
నందు। నేనుండగానొక్క దానవుండురువడి గగనమార్గమున వెక్క
సముగ్గాగ। కలకంఠకంఠి నొక్కతెను రథంబుపైనుంచి దోడ్కొనిపోవు
చున్నతరిని। మగువతనచేలమున దన నగలుముడిచి। సరవినామ్రోల
నామూటజారవిడచె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ ౯౦.

నాతెయారీతిగానగలు జారగనైచి కనుగవయందశ్రుకణము
లొలుక । హారామహాలక్ష్మణారారె కావరే యనిశోకవార్ధిలో ము
నుగుచుండ । నాదైత్యుడురువడి నాసతీమణిగొంచు లంకదిక్కున కేగె శం
కలేక । యాభూషణములు సయ్యాననేను దాచితినని చెప్పి నీకుసమర్పణం
బు । సేయగాగాంచి మదినీవు చింతిలంగ । ననునయాలాపముల దేర్చి
యినజు డనియె । వరగుణస్తోమ॥ ౫౧.

అర్కకులేశ మీ రానతిచ్చినరీతి వాలిజంపితి రేని వసుమతీజ ।
వెదుకంగ వానరవీరుల నంపించి భూర్భువస్స్వర్గాదిభువనములను । శో
ధింపజేసి యెచ్చోటనున్నను దెచ్చిమీకర్పణ మొనర్తు బ్రాకటముగ ।
ననవినిసంతోష మడరసుగ్రీవుని దటుకుననీవు కౌగిటనుజేర్చి । తప్పకుం
డంగ వాలి నంతకునిపురికి । ననుపుదునసంగ మరియు నయ్యినజుడనియె ।
వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౫౨.

వాలిమహాబలవంతుడాతనిజంప నవనినెవ్వరికి సాధ్యంబుగాదు ।
కావున దుందుభిఘనకళేబరమొక్క చేతను నీవెత్తి చిత్రగతిగ । నేడు
తాళంబుల నేకబాణంబుననుర్విని బడనేయనోపితేని । ఘనబలుండైన
వాలినిజంపగలవని నామానసమ్మున నమ్మువాడ । ననగనారెండు కార్యం
బులాక్షణంబ । యశ్రమంబుగజేసితి వౌర నీవు । వరగుణస్తోమ శ్రీపైడి
వాడధామ । రాజసుత్రామ పట్టాభిరామనామ॥ ౫౩.

అంతసుగ్రీవుండు సంతోష మొప్పంగ నినులక్ష్మణుని వెంట గొని
రహస్యముగ నేగి కిష్కింధ ప్రాంతగ్రామముతోట యందలియొక చెట్టు
క్రిందనిమ్ము । గూర్మండజెట్టితా గొబ్బునజని వాలి నగరువాకిటనిల్చి
గగనమదర । సింహనాదముజేసి చివ్వకురమ్మని వాలినిబిలచిన గాలరు
ద్రు । డనగనవ్వాలి బిరబిర నరుగుదేర । నిరువురుబెనంగుచుండి రహీన
గతిని । వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౫౪.

వారిట్లుపెనగగ నీవ్వాడిశరంబు చాపంబునసంధించి పటురయ
మున । శాఖామృగేంద్రువక్షము నీవు గురిజేసియేసిన బెనుమంటలెగ

యవాని। యురమందుగాడంగ నుర్వీధరముకీతి నవనిపైనొరిగి గతాసు డయ్యె। నంతసుగ్రీవుండు సంతుష్టచిత్తుడై నినుగొనియాడంగ నిర్జరాళి। కుసుమవర్షంబు లవనిపై గురిసిరపుడు। దుందుభిధ్వానములు దిశల్ గ్రందుకొనియె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౫౫.

తరువాతవాలికి దహనాదికృత్యముల్ సల్పిసుగ్రీవుండు సంతసమున। దావకపాదసందర్శనంబొనరింప మిత్రజుతోడ సౌమిత్రి నంపి। ముదమొప్పగపిరాజ్యమునకు నర్కజునభిషిక్తునిగాజేసి శ్రీదలిర్ప। మరి యునవ్వాలి కుమారుడం గదు నప్పుడనుపొంద యావరాజ్యాభిషిక్తుజే యనియమింప నతడట్లుచేసివచ్చె। నంతసుగ్రీవుడెదలోన సంతసించె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౫౬.

అపుడు వర్షాకాలమగుటను రవిజుండువేడ్కమీతోనిట్లు విన్నవించె। దేవయిన్వార్షిక దినములేగినవెన్క వేడ్క ప్రశ్వేసుతాన్వేషణంబు। సేయంగ వానరసేనలగొనివచ్చి యఖిలదిక్కులకు నేననుపువాడ। ననగమోదించి నీవనుజునితో గూడి దశయకమాల్యవంతంబు జేరి। చింతచేనుండ నంత హేమంతఋతువు। రాగ రవిజుడు రామికాగ్రహామువొడమి। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౫౭.

ఘనబలుండగులక్ష్మణుని బంపనాతడుగ్రమున గిష్కింధాపురంబుజొచ్చి। భానుజుగన్గొని పరుషోక్తులాడంగ మిక్కిలిభయమంది మిత్రజుండు। సవినయమొప్పంగ సౌమిత్రిబూజించి కపిబలంబులతోడ గదలివచ్చి। భక్తితోమీపాదపద్మంబులకుమ్రొక్కి చేతులుజోడించి శిరమునందు। జేర్చివినయవిధేయుడై చిత్తమునకు। నింపుబుట్టంగమరియు దానిట్టులనియె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౫౮.

అపరాధిగాను మహాప్రభూ వానరసేనరమ్మని వర్తమానమంపి। తత్సేనవచ్చునంచాకపరీక్షింప దశవర్యోగానజిత్తమున గినుక। విడచిపోవుమటంచు విన్నపంబొనరింప నారవిపుత్రుని గారవించి। సీతను వెదుకంగ శీఘ్రంబుగా వానరులబంపునీవంచు బలుకతరిని। భూమి

యీనిన్కై వడి భూరిసత్త్వు। లైనవానరులరుదెంచి రద్భుతముగ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౫౯.

ఇత్తెరంగున వానరోత్తము లేతేర గాంచి సుగ్రీవుండు గడుముదమున। శతసహస్రవనాటపతులతో వినతుని బటుగలిబూర్వదిగ్భాగమునకు। హనుమదంగదగవాక్షాదులదక్షిణదిశకు సుషేణాదిధీరకపుల। బశ్చిమదిశకును బల్లిదులగుశతబలిముఖవానరావలి నుదీచి। దిక్కునకు సీత వెదుకబుత్తెంచి మరియు। వారితో బల్కెనిట్లు ప్లవంగవిభుడు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౦.

కపులారవినుడిమీ కిపుడు నేజెప్పిన రీతిని శ్రద్ధతో సీత వెదకి। మసలకమీరొక్కమాసంబులోపల దిరిగిరావలయును దెంపుమీర। నారీతిరాకెవ్వడాలస్యమొనరించు నోవానిగూర్రంబు గావధింతు। ననిచెప్పిపంపు నయ్యవసరమందున భవదంగుళీయంబు పవనసుతుని। చేతికిచ్చి చనదియు సంప్రీతినాత। డందుకొని నీకు వందన మాచరించె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౧.

కపులాక్షణంబున గదలినానాదిక్కులకు నేగి నదులు శైలములు వనులు। పట్టణంబులు చిన్నపల్లెలు మొదలగు స్థలములు వెదకి భూతనయ నెచట। గానక బూర్వదిగ్భాగమేగినవారు వరుసగా బశ్చిమోత్తరపు దిశల। కేగినవానరులే తెంచి సీత లేదని జెప్పి రప్పు డయ్యనసుతునకు। నంతదక్షిణదిశ కేగి నట్టిపవన। జాదులవనిజ వెదకుచు నరిగియరిగి। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౨.

పక్షీంద్రుడైన సంపాతిచే వైదేహీవృత్తాంతమెల్లను వివరముగను। విని మోదమున గపివీరు లంభోనిధితీరంబునకు జేరి వారిరాశి। బొడగాంచి యెవ్వడీ కడలి దాటునటంచు సంశయింపుచున్న జాంబవంతు। డనిలకుమారుని గని నీవు దక్క నొరులియ్యుదధిదాట నోపరసిన। సంతసంబందె నా హనుమంతుడపుడు। ఇద్ది కిష్కింధయను కాండ మెసగముగిసె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౩.

## సుందరకాండము.

ఎల్లవానరులు మహేంద్రపర్వతమెక్కి హనుమంతు నగ్గింప నత డులంక। కేగుటకును నిశ్చయించిశ్రీరామునీపాదంబు లెదనిల్పి బ్రహ్మవిష్ణు। శంకరులకు మొ్రక్కి చరణముల్ సమముగానుంచి భుజంబులంకించి మేను। బెంచిచెంగుమని కుప్పించినభోమార్గమునకుద్గమించి క్రన్న నజనంగ। హితమొనర్పంగమైనాక మేగుదేర। వక్షమునదాకె నగ్గిరివార్ధిబడగ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౪

సురలదిజూచి యచ్చెరువొంది సురసాఖ్యపన్నగాంబనుబంప బవనసుతుడు। సరభసంబునదాని జఠరాంతరముజొచ్చి తిరిగిపైకేతెంచి సురలువొగడ। జనుచుండి సింహిక యనెడుఛాయాగ్రాహిచే మ్రింగబడిదాని జీరికెడపి। శతయోజనాయతజలరాశి నవలీల దాటిసువేలభూధరమునందు। నిల్చిలంకాపురము గాంచినీరజాప్తు। డస్తమించినవెన్క నత్యద్భుతముగ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౫.

లంకాపురముజొచ్చి లంకయనర్కసి బరిమార్చిసూక్ష్మరూపముధరించి। బంగారుమేడల రంగస్థలంబుల సంగీతగృహముల నంగళులను। గజశాలలను తురంగమశాలలనుమణి రథశాలలనుకోశాగారములధాన్య। శాలల నాయుధశాలలగారాగృహంబుల గేళీగృహంబులందు। వేసరకధారుణీసుత వెదకివెదకి। కనుగొనంజాలకప్పుడా కపివరుండు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౬.

పరువడిరావణు పడకటింటికిబోయి కలయనారసిపంక్తికంఠుశయ్య। నొయ్యననిద్రించుచున్న మందోదరిగన్గొని జానకిగాదలంచి। మగుడనాలోచించి మహిజాత యిట్లన్యపురుషులప్రక్కలో బొసగనిద్ర। బోవునే యీకాంత రావణుపత్నియౌ నానినిశ్చయించితానచటుబాసి। కడురయంబునజని యశోకవనమందు। జేరియచ్చోటవానరశేఖరుండు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౭.

వెరవొప్ప శింశుపావృక్షమూలంబున ఘనశోకవహ్నిచే గ్రాగుదాని। జెక్కిట జేర్చి పొక్కుచు నేడ్చుచు గతినొర్వశయనించి కందు

దాని। గమలంబుపైమంచుగప్పిన చందాన జెమ్మటముఖమందు గ్రమ్ము దాని। జడగట్టికేశముల్ మెడలపై జారంగ వేడినిట్టూర్పులు వెడలుదా ని। సీతబొడగాంచి వానరసింహుడలరి। శింశుపావృక్షశాఖపై జేరెనపు డు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౮.

పవనజుం డాశింశుపావృక్షశాఖల నొదిగిమనంబున ముదమెల ర్ప। జానకినప్పుడు నిదానంబుగాజూచి మనుజేశ్వరుండు జెప్పినవిధంబు। కరములుజరణంబు లురమువక్షంబును కన్దోయినాసిక గర్ణయుగళి। ము ఖముకపోలముల్ నఖములు మధ్యంబు దంతముల్ చుబుకంబు గుంతల ములు। సమముగానుండె నింకనిస్సంశయముగ। నిదియెజానకియని ని శ్చయించెమదిని। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౬౯.

దశకంఠుడప్పుడు దనుజాంగనలుగొల్వ గామాంధుడై సీతకడకు వచ్చి। సామాదిబహువిధ సాధనంబులచేత బోధింపబోవ నాభూమితన య। కడుకోపమున మహాకఠినోక్తులాడంగ దనుజేశుడెక్కుడు కినుకబొం ది। దనుజాంగనలనెల్ల గనుగొనియిట్లను రెన్నెల్లలోనిది నన్ను గవయ। నొప్పకుండినమీరెల్ల దప్పకుండ। జంపిభక్షింపుడనిచెప్పి చనియె బురికి। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౦.

అంత నారాక్షసకాంతలా కాంతను భర్జింపనాసమీపమున నిద్ర। జెందిసత్రిజటబా జెడుకలగని లేచి రాక్షసాంగనలతో నాక్షణంబు। నెరిగింపవారెల్ల నెక్కుడుభయమంది వైదేహికడ వశవర్తులయి। మ్రొ క్కియుక్కడగి కన్మోడ్చినిద్రింపంగ నవనిజగాంచి యప్పవనసుతుడు। రా మ సేమ మెరిగించి రమ్యమైన। యుంగరంబొనవాలుగా నువిద కిచ్చె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౧.

భవదంగుళీయ మాభామినీమణి తనయుత్తమాంగంబునం దు నిడికొనుచు। బావనితోడదా బడుబన్నములు జెప్పి దుఃఖింపుచుండనా తోయజాక్షి। బోధించి మరియునా భూసుతచేనానవాలు గైకొనియాజ్ఞ వడసివనము। పెకలించి రాక్షసనికరంబుబరిమార్చ హతశేషులరిగి ద

శాస్యునకును । జెప్పగాగంఢ్ల నిప్పుకలుప్పతిల్ల । ఘనబలసచివసుతసప్త కంబుబనిచె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౨.

హయమదేభస్యందనారూఢులై మంత్రిసుతసప్తకము దన్ను జుట్టుముట్ట । సరగునదోరణ స్తంభనిక్షిప్తమా పరిఘంబుగొనుచు వానరవరుండు । సేనలతోడదత్సేనాధిపతులను సమయింపనంత రాక్షసవరుండు । ప్రఘసవిరూపాక్ష భాసకర్ణాదుల బంప వారలజంపె బవనసుతుడు । మారుతినిజంప నక్షకుమారునంప । దెంపుతోవాని గపిపతి చంపెనంత। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౩.

రావణుండంత నుగ్రతమేఘనాదుని బంపవాడే తెంచి పవనసుతుని। బ్రహ్మాస్త్రమున బట్టువరిచి రావణుమోలిల నిల్పవాయుసుతుండు, నిర్భయముగ। బరుషోక్తులాడంగ బంక్తికంధరుడాగ్రహంబున నప్పుడయ్యనిలసూను। వాలంబుగాల్పింప వాలాగ్ని చేలంక భస్మంబుగాజేసి పటురయమున । జలనిధితరించి నినుగాంచి జనకజాత । క్రమమెరింగించె సుందరకాండమిదియ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౪.

యుద్ధకాండము.

అనిలసూనుండిట్లు జనకనందనయున్కి జెప్పిన సంతుష్టచిత్తుడవయి । జడనిధినేరీతి గడువవచ్చునటంచు సుగ్రీవునడుగ నాసూర్యసుతుడు। వానరావలిచేత వార్ధిగట్టించెద ననివిన్నవించి చయ్యనతండు। నంగదముఖ్య ప్లవంగవీరులతోడ నినులక్ష్మణుని వెంట గొనిరయమున। వార్ధిచెంతకునే తెంచి వానగాలి। గిరులుగొని తేర బనిచెసుగ్రీవుడపుడు।వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౫.

గజగవయగవాక్ష గంధమాదనమైంద జాంబవత్పనస ప్రజంఘనీల । శతబలిద్వివిద కేసరితార దధిముఖశరభ సుషేణాది తరుచరాధి। నాయకుల్ ఘనమైన నగములుగొనివచ్చి చేతికందిచ్చిన జిత్రముగను । నలుడందుకొనివార్ధి నడుమనునైవంగ దెప్పునసేటిపై దేలెగిరులు। సంఘులందున వృక్షపాషాణ సమితి । బొందుపరచుచు సురలుగొందగట్టె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౬.

వానరులిరీతి వార్ధిగట్టుచునున్న వార్తదా వేగులవారివలన।
వినిదశగ్రీవుండు విస్మయచిత్తుడై తనమంత్రివరులు బాంధవులుగొల్వ।
బేరోలగంబుండి పెక్కువిధంబుల నాలోచనము సేయు నవసరమున। స
రగుననవ్విభీషణుడగ్రజుని గొల్వ కూటంబునకుబోయి సూటిమీర। న
న్న పాదంబులకు మ్రొక్కి యర్హపీఠ। మందుగూర్చుండి పల్కెదాన
న్నతోడ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౭.

అన్న నేనొకమాట విన్నపంబొనరింప గావచ్చినాడ నాగ్రహము
విడచి। వినుమనుసీతను నీవు గొనివచ్చినది మొదల్ బహుదుర్నిమిత్త
ముల్ పట్టణమున। బొడసూపె ననలంబు నొడిగట్టుకొన్నట్లు తెచ్చితీ
వారాము దేవినీవు। సీత సాక్షాల్లోకమాతగావుననిప్పు డామెనుమరల
శ్రీరామునకును। వేగమర్పింపు మట్లు కావింపకున్న। దనుజకులనాశనం
బగు నను చుబల్కె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౮.

ఆమాటలకు నద్దశాస్యుండు కోపించి తమ్మునియురము పాదము
నదన్ని। సభ వెడలింపంగ సరభసంబున విభీషణుడు మంత్రులతోడ జడ
ధిగడచి। నినుగాంచి వందనమ్మొనరించి రావణు సేత లెరింగింప బ్రీతినత
ని। కభయంబొసంగి చయ్యనవార్ధిదాటి వానర సేనతో లంక నాల్గుదిశ
ల। జుట్టిముట్టంగ నప్పు డా సుకవిమతుడు। రాక్షసావలినంపెను రణమొ
నర్ప। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౭౯.

వచ్చినరాక్షసావలితోడ వానరుల్ ఘోరయుద్ధము జేసి వారినె
ల్ల। వాలంబులనుజుట్టి వడినేలపైగొట్టి కథ తేర్పగా పంక్తికంఠునకును।
హతశేషులెరిగింప నాశ్చర్యచిత్తుడై యాక్షణంబున నె ధూమ్రాక్షశోణి।
తాక్షయూపాక్ష మహాకాయకుంభ ప్రహస్తనికుంభ దేవాంతకాది।
రాక్షసావలినంప వారాక్షణంబ। హయగజస్యందనారూఢులగుచు జని
రి। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౦.

ఆరాక్షసానీక మత్యంతగంభీర సింహనాదంబులు చేసికొనుచు।
పాశిసముద్గరఖడ్గ భాసురాంకుశవరచ్ఛురికాపరశుచక్ర శూలముఖ్య।

వివిధాయుధములతో వెరువకకపిసేన నుక్కడంపుచున్న నురుబలా
ఢ్యు లగు వాయుసుతముఖ్యు లగణితగిరి వృక్షపాణులై యెదిరించి ప్రా
భవమున రథతురంగమదేభ సారథిపదాతి । చయమునుగ్గాడి రవ్వుడో
క్క క్షణములోన వరగుణస్తోమ శ్రీపైడివాడధాము॥ ౮౧.

అంగదుచేత మహాకాయుడీల్గె బ్రహస్తుని నీలుండు హతమొన
ర్చె దక్కినరాక్షసుల్ తరుచ కేందుగలచేత రణమందు గూలంగ రావ
ణుండు గినుకచే నింద్రజిత్తునుబంప నాతండు చతురంగబలముతో నతు
లశస్త్రి సాధనుడైవచ్చి సరభసంబున నాగపాశాస్త్రిమేసిన బన్నగాళి
నిన్ను లక్ష్మణు దరుచరానీకమునను మించి ఘృణిదూలనపుడు బంధించె
గాదె వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౨.

ఏపుమీరగ నారదోపదేశమున నీ వలగరుడాస్త్రింబువలన నా
గ పాశబంధవిముక్తి బడయనంతట నింద్రజిత్తు లంకకుబోవ నత్తరం
గు రాక్షసాధీశుని రాణి మందోదరి విని పతింటకేగి వినయమొప్ప నీ
తులుచెప్పిన నిర్లక్ష్యమొనరించి యుద్ధమొనర్ప సన్నద్ధుడగుచు వచ్చి
నినుదాకి పోరాడి చిచ్చుబోలు నీశరాగ్నికి సమిధంబు నిలువలేక వర
గుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౩

దివిజారిభీతుడై తిరిగిలంకకుబోయి కుంభకర్ణుని మేలుకొలిపి వా
ని యుద్ధంబునకుబంప నుద్ధతితో వాడు ఘోరభయంకరాకారుడగు
చు ప్లవగవీరులనెల్ల భక్షించుచుండంగ నీచాపనిర్ముక్త నిశితశరము
వానికంఠముదుంచి నైవంగ నతికాయు డనువాడువచ్చి నీ యనుజుచే
త సమరమునగూలె సురలెల్ల సంతసింప నింద్రజిత్తును మరల వానేగు
దెంచె వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౪.

మేఘమధ్యమున నమ్మేఘనాదుడునిల్చి యలబాణవితతి పుం
ఖానుపుంఖముగ నేయుగా నప్పుడగచరుల్ భయమంది నీ వెన్కజొచ్చి
ననిరుపమాన మాయతాస్త్రిస్తున భూధరన్యస్తల మాయగావింప నై
తేయుడపుడు భూమికిడిగివచ్చి భూరియుద్ధమొనర్ప సౌమిత్రి యప్పు

డు సమరమందు। నాదురాత్మునిజంపె బ్రహ్మాస్త్రముననుు। వరగుణస్తోమ
శ్రీపైడివాడధామ॥ ౮౫.

హతశేషులగు దైత్యు లతివేగజని రాక్షసేంద్రునితోడ నయ్యింద్రజిత్తు। పాటెరిగించిన బహుదుఃఖితాత్ముఁడై కొంతప్రొద్దుసకు నత్యంతధైర్య। మవలంబనముచేసి బవరంబులోనేను రామునిజంపక రానటంచు। హయమదేభస్యందనాదికచతురంగ బలసమేతంబుగా బయలుదేరి। సురలుబెగడంగ నాహవక్షోణికేఁగె। ప్రళయకాలుని రీతి నప్పంక్తిముఖుఁడు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౬.

అట్లేగుదెంచి చయ్యన విభీషణుఁగాంచి కుటిలాత్మ శత్రునిఁ గూడితివిమనుజాధమునకు నాముత్యంబెఱింగించి నక్తంచరాన్వయ నాశనంబు। సేయుచుంటివిగాన శీఘ్రంబునిన్నుఁ గడతేర్పవలయు దక్కకనిపల్కి। కన్నులయం దగ్నికణము లుప్పతిలఁగ నారినిమోపించి త్రైయకనుక। శక్తియును బాణమొక్కటి చాపమునను। డొడరఁజేసెత లడలంగ విడచెనప్పుడు। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౭.

పటుగతి శతకోటి బడబాగ్నులొక్కట నొగిగూడివచ్చినపగిదిదిశలు। క్రమ్ముకొనుచురాఁగ గాంచిలక్ష్మణుఁడంత శరణార్థియగు విభీషణునుమనుచుట। ధర్మంబటంచు నాతనివెనుకఁ దోచి తానావచ్చుశక్తికి సన్ముఖముగను। నిల్వంగనాశక్తి బల్విడి సౌమిత్రి వక్షంబుగాఁడిన నాక్షణంబ। కపులహాహారవంబులు గడలుకొనగ। సురలుబెగడొంద మూర్ఛిల్లి ధరణివ్రాలె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౮.

ఈగతిమూర్ఛబోయిన లక్ష్మణునికడ రవిసుతాదులనుంచి రామ నీవు। పటురోషమున విల్లుబట్టి బెట్టిదముతో శరపరంపరల నత్యుగ్రతరముగ। సంధించిరావణు సర్వాంగముల గాడనేసి చాపముద్రుంచి గాసిజేసి। రథమునుగ్గాడి సారథినిడొల్లగనేసి హయములఁ బడనేయ న సురవరుఁడు। నిలువజాలక మూపున నెరులువ్రేల। రయముగాఁబారి లంకాపురంబుసొచ్చె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౮౯.

అనుఁడుఁడీగతి బార నప్పుడు విల్లెక్క డించి నీ వనుజునిగాంచి మిగుల। విలపించుచుండ వేవేగ సుషేణుండు బర తెంచి సౌమిత్రి పదకరములు। పరిశోధనముజేసి ప్రాణమున్న దటంచు నిను దేర్చి శీఘ్రమ య్యానిలసుతుని। ద్రోణాద్రికంపిన ద్రోవలోపల గాలనేమి మాయలొనర్ప గాముహూగ్ర। కోపముదయించి కరువలి కొడుకు వాని। గెడపి ద్రోణాద్రి దెచ్చెను గడియలోన। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౦.

అనిలజుఁడిట్లు ద్రోణాద్రి దెచ్చిన సంతసించి సుషేణుండు శీఘ్రముగ నా। దత్పర్వతంబందు దనరిన సంజీవకరణియు సౌవర్ణ్యకరణి మరియు। సంధానకరణి విశల్యకరణియు ముఖ్యదివ్యౌషధంబులు దీసివేగ। సౌమిత్రికివ్వ నాశ్చర్యమొప్పగ నిద్రజెంది లేచినగతి మందహాస। ముఖముతో లేచి నీకంత మొక్కగతని। బిగియు కౌగిటజేర్చితి ప్రియమెలర్ప। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౧.

కపివరులప్పుడు లంకాపురంబదురంగ సింహనాదంబులు సేయుచుండ। విని రావణుడు మహావిభ్రాంతచిత్తుడై చారులచే సమస్తంబు నెరిగి। శ్రీరాము గెల్తునే రీతిగానని మానసంబున దలపోసి ఘరభసమున। గులగురుండైన శుక్రునియాజ్ఞ బాతాళహోమంబు నొనర్చుచునున్న తరిని। తద్విఘంబెల్ల నప్పుడా దైత్యవరుని। తమ్ముడెరిగించె భవదీయ సమ్ముఖమున। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౨.

ప్రాణకుండగు దైత్యపతి సేయు పాతాళహోమభంగ మొనర్పగా మహోగ్ర। మూర్తులౌ వాయుజముఖ్యుల నంపింప నేపుగా వారు లంకాపురంబు। జొచ్చి రావణునందు శోధించి కానక సరమచే నెరిగి మత్సరముతోడ। బిరబిరజని నికుంభిల కేగియందున్న కావలిదైతేయగణము జంపి। పంక్తికంఠుని గని వాని బహువిధముల। గాసిజేసిన నించుక గదలడయ్యె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౩.

అపుడంగదుడు వేగ నంతఃపురముజొచ్చి రావణుపట్టంపు రాణియైన। మందోదరినిగాంచి మహితసాహసమున గేశపాశంబును గేలబ

ట్టి। పులిగోవునీడ్చిన పోల్కినీడ్చుకపోయి రావణుమ్రోల నారమణిని
ల్పి। నతిదుఃఖితాత్మయై పతినిదానగణితగతుల నిందింప రాక్షసవిభుం
డు। కినుకవాఁడమంగ ఖడ్గమంకించి వాలి। సుతునిహస్తంబునందునుద్ధతి
నిగొట్టె। వరగుణస్తోమ శ్రీపైడిపాడధామ॥ ౯౪.

కపులిట్లు హోమభంగముజేసి యార్చుచునేతెంచి నీతోడ నా
తెరంగు। విన్నవించిరి దైత్యవిభుండు తోకద్రొక్కిన పామువలె గడు
కినుకవాఁడమై। యుద్ధసన్నద్ధుఁడై సిద్ధచారణయక్షసురముఖ్యు లడల బ్ర
స్ఫురితహారకేయూర రత్నాంగుళీయక మణికిరీటాదులు జాల్వ దై
త్యాళిగొలువ। శంఖభేరీమృదంగ ప్రశస్తతూర్య। నాదములెసంగవచ్చె
రణంబొనర్ప। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౫.

రోషంబుతో ఖడ్గరోముండు వృశ్చికరోముండు మరిసర్పరోము
డగ్ని। వర్షుఁడీనల్వురు వారణసైంధవ స్యందనంబులతోడ సమరమునకు।
చ్చివిజృంభింప వాయుతనూజుండు ఖడ్గరోముని బుచ్చె గాలుపురికి।
వాలితనూజుండు కూలనేసెను సర్పరోముని వృశ్చికరోమునీలు। డాహ
వంబునగూల్చె నయ్యగ్నివర్ణు। ప్రాణములు నీవుగొంటివి ప్రాభవము
న। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౬.

అంతనారావణుం డంతకాకారుఁడై దశహస్తములవిండ్లు దాల్చి
యన్య। దశహస్తములబాణతతి బూనిసంధించె నినుమార్కొనంగనీవ
నుపమాస। సాయకంబులువింట సంధించికొండపై వర్షంబుగురియు వడు
వుదోప। భూరిశరంబులు పుంఖానుపుంఖంబుగా బ్రయోగింపుచు గ్రు
లువాఁగడ। రావణుని దేహమెల్లను రక్తధార। లుబ్బనేసితివహాహా నీవ
బ్బురముగ। వరగుణస్తోమ శ్రీపైడిపాడధామ॥ ౯౭.

నీవుభూతలమందు నిల్చిపోరుట రావణుండు రథంబుపై నుండు
టయును। కాంచి దేవేంద్రుండు గ్రక్కున మాతలిచే దివ్యరథమును జి
త్రకార్ము। కంబు నభేద్యమౌ కవచంబు నక్షయతూణీరమును భక్తితోడ
నంప। నాదివ్యరథమున కంజలియొనరించి నీవారథము నెక్కి చేవమీర।

గవచముధరించి తత్కార్ముకంబుబూని। యుండగని రావణునికంఠగళం
డెలవిసె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౮.

ఈరీతిరథమెక్కి యారావణునితలల్ పదియును జేతులు పది
యు బదియు। భువిబడనేయ నద్భుతమొప్ప వెంటనేమొలచె నాచేతు
లు దలలుమగుడ । బోడిమితోడ నిక్కడహోరాత్రముల్ తలలు జేతు
లును ద్రింప దక్షణంబ। పుట్టుచుండుటకు నద్భుతమానసుండవై కడకవిభీ
షణు నడుగనాత। డనియె దగ్గర్భమందున నమృతఘటము। గలదదిహ
రింపనేయు మీక్షణమునందె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౯౯.

ఆవిభీషణుపల్కు లాలించికడువేగ మనలాస్త్రమేసి యయ్యసు
రగర్భ। మందున్న యమృత మొయ్యన హరింపగజేసి తరువాత మ్రోరి
నూట యేభువ దేను। పర్యాయముష్ణులుతలల్ పడనేయగానంత నొక్క శి
రంబుతో నక్కజము। నిల్చియుండగజూచి నీవంతబ్రహ్మాస్త్ర మేయ
గానపుడు దైతేయప్రభుడు। కొండరీతిగ రథముపై గూలి సమసె। నెవ్వ
గావాని తేజంబు నిన్ను జేరె। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౦౦.

భువిమీదగురిసిరి పుష్పవృష్టిసురాళి పాడిరి గంధర్వపతులు వే
డ్క। నాడిరి మేనకాద్యప్సరాంగనలెల్ల నతిశీత మలయమారుతము వీ
చె। నంతవిభీషణుం డన్నకైశోకింప నాతనిబ్రీతి నోదార్చి సీత। నచటికి
రప్పించి యగ్నిలోజొరబంచి పూతాత్మయగు మహీపుత్రినపుడు। ప్రీతి
గైకొన్నివేడ్క నమ్మాతలికిన్ని। బహుమతులొసంగి దివికంత బంపినావు।
వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౦౧.

అలవిభీషణుడు నీయాజ్ఞగైకొనిపోయి తనయన్న కపరకృత్య
ములొనర్చి। శుచియైనిశాచర ప్రచయంబుతోడ నీకడకరుదెంచిన గరు
ణతోడ। లక్ష్మణునంపించి లంకాపురంబున కా విభీషణుని పట్టాభిషిక్తు
జేయించి యాతడిచ్చిన పుష్పకంబుపై జానకీలక్ష్మణ సహితముగను। వెలి
గి సరాక్షసులుగపుల్ గొలువ గగన । మార్గమున దాటితివిసీవు దుర్గ
మాబ్ధి । వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౦౨.

కిష్కింధ గన్గొని కీశాంగన... ల్ల రావింపుమనగ నా రవిసుతు
డు। తారా రుమాముఖ్య నారీసమూహంబు దోడ్తేర వాసు సంతో
మొప్ప। సీతకు మ్రొక్కి సంప్రీతితో దివ్యాభరణవస్త్రతతి సమర్పణ
మొనర్ప। గైకొని వారల గౌరవంబున బుచ్చి తరువాత నల భరద్వాజమౌ
ని। యాశ్రమముజేరి యచ్చోట విశ్రమించి। యమ్మునీంద్రుడొనర్చు విం
దారగించి। వరగుణస్తోమ శ్రీపైడివాడ ధామ॥ ౧౦౩.

ముందు నందిగ్రామమునకు వాయుతనూజు నంపించి నీరాక భ
రతునకును। గెలుప బర్వంబున జలధి బొంగిన భంగి బొంగుచు సాకేతపు
రమునకును। వార్తనుబంపించు వలనొప్పదాను నీకెదురుగావచ్చి నీపద
ములకును। సాష్టాంగమొనరించి సౌమిత్రి నాలింగనముజేసి భక్తి జాన
కికి మ్రొక్కి। భానుజవిభీషణాదుల బ్రస్తుతించి। ప్రీతి మిము దోడి తెచ్చె
సాకేతపురికి। వరగుణస్తోమ శ్రీపైడివాడ ధామ॥ ౧౦౪.

పురవాసులెల్ల గుంపులుగట్టుకొని మహామోదిత చిత్తంబుల నె
దురుకొనగ। మరియు సుమంత్రాద్య మాత్యవర్గము వచ్చి నయమారసీ
దర్శనంబొనర్ప। దల్లులు ముగ్వురు నుల్లాసమొప్పంగ నాందోళికారూ
ఢలగుచు రాగ। బట్టణస్త్రీలుగ ప్రంపుటారతులెత్త వసుమతీసురులు దీవ
నలొసంగ। సానులొకవంక నృత్యముల్ సల్పుచుండ। శుభముహూర్త
మునను గోటజొచ్చితౌర। వరగుణస్తోమ శ్రీపైడివాడ ధామ॥ ౧౦౫.

సీతాసమేతుడవై తల్లులకు మ్రొక్కి బంధువర్గము నెల్ల బలుకరిం
చి। సంతసంబున నున్న సమయమందు వసిష్ఠమునివరుండే తేర మోదము
లున। నెదురుగానేగి తత్పదకంజయుగళికి భక్తితో బ్రణమిల్లి పాద్యముఖ్య
విధుల చే బూజింప వేడ్కనయుంధరీకాంతుడు దీవించి సంతసమున। మం
త్రులకు జెప్పి వేగ సమస్తపుణ్యనదనదీవారి దెప్పించె ముద మెలర్ప। వర
గుణస్తోమ శ్రీపైడివాడ ధామ॥ ౧౦౬.

నవరత్న సింహాసనమునందు నిన్నుంచి వామభాగమునందు వసు
మతీజ। నుంచి చామరముల నుభయపార్శ్వములందు భరతశత్రుఘ్ను

ఉపట్టివీవ। సౌమిత్రి మాక్తికచ్ఛత్రంబు
ములొత్త । నొకవంక భాగవతోత్తము బట్టంగ బవనతనూజుండు పద
ల్లొగినుతింప। నవ్వసిష్ఠుడు నిన్ను బట్టాభిషిక్తు। జేసె నిదియుద్ధకాండము గీర్తింప నొకదిక్కు మాగధు
చెప్పినాడ। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౦౭.

పదధూళిచేరాయి పడతిగా భావించుట భవుకార్ముకముభంగ పరుచు
టయును। భార్గవరాముని పరిభవించుట ఖరదూషణత్రిశిరుల దునుము
టయును । బలశాలి యగువాలి నిల దొల్లి నేయుట వనచరావలిచేత
బనులుగొనుట। ఘనమైనవారాశి గర్వంబణంచుట నీటిపైగొండలు ని
ల్పుటయును। దేవకంటకులైనట్టి రావణాదు। లనువధించుట దరమె యీ
శునకునైన। వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౦౮.

దివిజులుస్వేచ్ఛగా దిరుగంగజాలిరి నిష్ఠలు మునితతి సేరుపసా
గె। రవి నిర్భయంబుగా రశ్మి ప్రసాదంగ దేవీసమితిబయల్ దేరగ
లై। బలవైరి నగరువాకిలి దర్పిగాగల్గె గిన్నరీ గానంబు వన్నెమీరె। వ
నరాశిమిక్కిలి ధ్వనిసేయగాజొచ్చె భూతజాలంబు నిర్భీతిమసలె। నఖిల
లోకవిద్రావణుడగు దశాస్యు। గదనమున నీవుగూల్చిన కారణమున।
వరగుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౦౯.

జయజయ రవివంశజలధిరాకాచంద్ర జయజయ రిపునాగచయ
మృగేంద్ర । జయజయ దశరథక్ష్మానాథవరపుత్ర జయజయ ధారుణీజాక
ళత్ర। జయజయ దైతేయశలభపావకకీల జయజయానవరత సత్యశీల । జ
యజయ దీనవత్సలమానవాధీశ జయజయ రావణాస్యవినాశ । జయజ
యకృపాలవాల దుర్జనవిఫాల। జయజయాశ్రితరక్ష విశాలవక్ష । వర
గుణస్తోమ శ్రీపైడివాడధామ॥ ౧౧౦.

అంగజరిపుధనుర్భంగ సత్కరుణాంతరంగ రాఘవనీకు మంగ
ళంబు। రాజీవభవ దేవరాజాదివిబుధసమాజసన్నుత నీకు మంగళంబు।
మిహిరవంశాంభోధితుహినకరా మహామహితవిక్రమ నీకు మంగళంబు।
మదదైత్యగర్వనీరదమహాఘాతూల మదనసుందర నీకు మంగళంబు। మ

ప ట్టా భి రా

నుకులవిభూషణా నీకుమంగళంబు
రగుణస్తోమ శ్రీపైడివాడధామ॥

ఇవెదివ్య మిదిభవ్య మిది
ణ్యా మిదిశరణ్యా। మనినేరచించితి నాచంద్ర
గతిలోన। ప్లవనామవత్సర పౌషకృష్ణాష్టమి సరికి నిం
య్యె। క్షితిలోన గేదార సెట్టి కృష్ణమసెట్టి యాభిధేయుని సహా
వలన। నెలమి ముద్రాంకితంబయ్యె నిది సమర్ప। ణంబు నీకిలనొనరించి
నాడ భక్తి॥ వరగుణస్తోవ శ్రీపైడివాడధామ। రాజసుతాత్మ పట్టాభి
రామనామ॥

సీతాపతి శుభచరితము। చాతురి బట్టాభిరామ శతకముగ భు
విన్। శ్రీ తోలేటి కులజుడగు। సీతారా[illegible] య్యయుడు రచించెన్ భక్తిన్॥

పట్టాభిరామశతకము సంపూర్ణము.

